# కలి విడంబనమ్

## కలియుగానికి వ్యంగ్య నివాళి

### నీలకంఠ దీక్షితులు

శ్రీమత్ తిరుమల లక్ష్మీకుమార్ (అనువాదం)

## అనువాదకుని వివరణ

పదిహేడవ శతాబ్దపు ప్రముఖ సంస్కృత విద్వాంసుడు నీలకంఠ దీక్షితుని ఈ కలివిడంబనం ప్రసిద్ధమైన వ్యంగ్య కావ్యం. అనేక అనువాదాలు, వివరణలు తేలికగా దొరుకుతాయి. వాటిలో కనపడని కొన్ని విషయాలు ఈ కొత్త అనువాదంలో పొందుపరచబడ్డాయి.

శ్రీమత్ తిరుమల లక్ష్మీకుమార్

# కలి విడంబనమ్

న భేతవ్యం న బోద్ధవ్యం న శ్రావ్యం వాదినో వచః ।
ఝటితి ప్రతివక్తవ్యం సభాసు విజిగీషుభిః ॥ ౧॥

అసమ్భ్రమో విలజ్జత్వమవజ్ఞా ప్రతివాదిని ।
హాసో రాజ్ఞః స్తవశ్చేతి పఞ్చైతే జయహేతవః ॥౨॥

ఉచ్చైరుద్ఘోష్య జేతవ్యం మధ్యస్థశ్చేదపణ్డితః ।
పణ్డితో యది తత్రైవ పక్షపాతోఽధిరోప్యతామ్ ॥౩॥

లోభో హేతుర్ధనం సాధ్యం దృష్టాన్తస్తు పురోహితః ।
ఆత్మోత్కర్షో నిగమనమనుమానేష్వయం విధిః ॥౪॥

అభ్యాస్యం లజ్జమానేన తత్త్వం జిజ్ఞాసునా చిరమ్ ।
జిగీషునా హ్రియం త్యక్త్వా కార్యః కోలాహలో మహాన్ ॥౫॥

పాఠనైర్గ్రన్థనిర్మాణైః ప్రతిష్ఠా తావదాప్యతే ।
ఏవం చ తథ్యవ్యుత్పత్తిరాయుషోఽన్తే భవేన్న వా ॥ ౬॥

# కలియుగానికి వ్యంగ్య నివాళి

సభలలో విజయం కోరుకునేవారు ప్రతి వాదుల మాటలు వినడం, అర్థం చేసుకోవడం అనవసరం. జంకు లేకుండా వెనువెంటనే ఏదో ఒక సమాధానం చెప్పేస్తే చాలు. (1)

ప్రతి వాదిపై జయం సాధించటానికి ఐదు సాధనాలు, (ఇతరులు ఏమన్నా) బెదురు చూపక పోవటం, సిగ్గులేకుండా ప్రవర్తించటం, (ప్రతి వాది మాట మీద) శ్రద్ధ చూపక పోవటం, (హేళనగా) నవ్వటం, రాజుని (మధ్యవర్తిని) పొగడటం. (2)

మధ్యవర్తి తెలివితక్కువ వాడైతే ప్రతివాది మీద జయం సాధించేసానని పెద్ద గొంతుతో ప్రకటించు. మధ్యవర్తి స్వయంగా పండితుడైతే పక్షపాతం చూపుతున్నాడని ఆరోపించు. (3)

లోభం వల్ల ధనం సాధించే వారికి ఉదాహరణ పురోహితుడు. తనని తాను (బ్రహ్మ ముఖం లోంచి వచ్చానని) పొగుడుకున్నా, వేదంలో చెప్పబడింది (కనుక తన మాట ఎప్పటికీ తప్పు కాదు) అన్నా, (ఎందుకు ఏది జరిగిందో) కారణాలు చెప్పినా, నీ ప్రారబ్ధం (పూర్వ జన్మలో చేసిన కర్మ ఫలితం) అన్నా ధనం కోసమే. (4)

జ్ఞానం అంటే శ్రద్ధ ఉన్నవాడు సిగ్గు పడుతూ (తనకి ఏమీ తెలియదు అనుకుంటూ) అభ్యసిస్తాడు. జయం (లోకంలో గుర్తింపు) కావాలనుకునే వారు సిగ్గు వదిలి (నాకే అన్నీ తెలుసని) కోలాహలం చేస్తారు. (5)

ఆయువు తీరే సమయానికి సత్యమైన ప్రతిష్ఠ (మోక్షం) లభించినా లభించక పోయినా పాఠాలు చెప్పటం, గ్రంథాలు నిర్మించటం చేస్తే ఎప్పటికప్పుడు పరిమితమైన ప్రతిష్ఠ లభిస్తుంది. (6)

స్తోతారః కే భవిష్యన్తి మూర్ఖస్య జగతీతలే ।
న స్తౌతి చేత్స్వయం చ స్వం కదా తస్యాస్తు నిర్వృతిః ॥ ౭॥

వాచ్యతాం సమయోఽతీతః స్పష్టమగ్రే భవిష్యతి ।
ఇతి పాఠయతాం గ్రన్థే కాఠిన్యం కుత్ర వర్తతే ॥ ౮॥

అగతిత్వమతిశ్రద్ధా జ్ఞానాభాసేన తృప్తతా ।
త్రయః శిష్యగుణా హ్యేతే మూర్ఖాచార్యస్య భాగ్యజాః ॥ ౯॥

యది న క్వాపి విద్యాయాం సర్వథా క్రమతే మతిః ।
మాన్త్రికాస్తు భవిష్యామో యోగినో యతయోఽపి వా ॥౧౦॥

అవిలమ్బేన సంసిద్ధౌ మాన్త్రికైరాప్యతే యశః ।
విలమ్బే కర్మబాహుల్యం విఖ్యాప్యావాప్యతే ధనమ్ ॥ ౧౧॥

సుఖం సుఖిషు దుఃఖేఽపి జీవనం దుఃఖశాలిషు ।
అనుగ్రహాయతే యేషాం తే ధన్యాః ఖలు మాన్త్రికాః ॥ ౧౨॥

యావదజ్ఞానతో మౌనమాచారో వా విలక్షణః ।
తావన్మాహాత్మ్యరూపేణ పర్యవస్యతి మాన్త్రికే ॥ ౧౩॥

చారాన్ విచార్య దైవజ్ఞైర్వక్తవ్యం భూభుజాం ఫలమ్ ।
గ్రహచారపరిజ్ఞానం తేషామావశ్యకం యతః ॥౧౪॥

స్వయంగా ఇతరులను పొగడనివాళ్ళు ఈ ప్రపంచంలో మూర్ఖులు. వాళ్ళని పొగిడే వాళ్ళు ఎందుకు ఉంటారు? ఎప్పుడో కదా ఈ మూర్ఖులకి ముక్తి. (7)

చదువుతున్న భాగం యొక్క అర్థం ముందుముందు స్పష్టం అవుతుంది అనో, ఇప్పుడు అర్థం అయ్యేటట్లు చెప్పటానికి సమయం లేదనో అనేస్తే, నేర్పిస్తున్న గ్రంథంలో అర్థం కానిది ఏముంటుంది? (8)

వేరే గతి లేదనుకోవటం, అతి శ్రద్ధాభక్తులు (ప్రశ్నలు వెయ్యక పోవటం), పూర్తిగా జ్ఞానం లభించకపోయినా తృప్తి పడటం అనే మూడు గుణాలు కలిగిన శిష్యులు మూర్ఖుడైన గురువుకి అదృష్టం కొద్దీ దొరుకుతారు. (9)

ఎల్లప్పుడూ విద్య యందు మనస్సు పెట్టలేని వాళ్ళు మాన్త్రికులో, యోగులో, సన్యాసులతో అవ్వొచ్చులే అనుకుంటారు. (10)

మంత్రం వెయ్యగానే (దానంతట అదే) పని జరిగితే మాంత్రికుడు గొప్పవాడని పేరు సంపాదిస్తాడు. ఆలస్యమైతే ఇంకా చాలా కష్టపడాల్సిన అవసరం ఉందని చెప్పి డబ్బు సంపాదిస్తాడు. (11)

సుఖంగా ఉన్నవారి సుఖం వల్ల, దుఃఖం అనుభవిస్తున్న వారి దుఃఖం వల్ల లాభం పొందే ఈ మాంత్రికులు ధన్యులు. (వాళ్ళు సుఖం కోల్పోతామనే భయం కొద్దీ, వీళ్ళు దుఃఖం పోతుందనే ఆశకొద్దీ మాంత్రికులని సంప్రదిస్తారు. (12)

అజ్ఞానం వల్ల మౌనంగా ఉన్నా, వింతగా ప్రవర్తించినా అవి (ఆ గుణాలు) మాంత్రికుడి మహాత్యంగానే పరిగణించబడతాయి. (13)

రాజులు ఎల్లప్పుడూ జోతిష్య ఫలితాలు తెలుసుకోవటం అవసరం అనుకుంటారు. (కానీ) వారికి ఫలితాలు చెప్పే ముందర జ్యోతిష్యుడు

పుత్ర ఇత్యేవ పితరి కన్యకేతి మాతరి ।
గర్భప్రశ్నేషు కథయన్ దైవజ్ఞో విజయీ భవేత్ ॥ ౧౫॥

ఆయుస్ప్రశ్నే దీర్ఘమాయుర్వాచ్యం మౌహూర్తికైర్జనైః ।
జీవన్తో బహుమన్యన్తే మృతాః ప్రక్ష్యన్తి కం పునః ॥ ౧౬॥

సర్వం కోటిద్వయోపేతం సర్వం కాలద్వయావధి ।
సర్వం వ్యామిశ్రమివ చ వక్తవ్యం దైవచిన్తకైః ॥ ౧౭॥

నిర్ధనానాం ధనావాప్తిం ధనినామధికం ధనమ్ ।
బ్రువాణాః సర్వథా గ్రాహ్యా లోకైర్జ్యోతిషికా జనాః ॥ ౧౮॥

శతస్య లాభే తామ్బూలం సహస్రస్య తు భోజనమ్ ।
దైవజ్ఞానాముపాలమ్భో నిత్యః కార్యవిపర్యయే ॥ ౧౯॥

అపి సాగరపర్యన్తా విచేతవ్యా వసున్ధరా ।
దేశో హ్యరత్నిమాత్రేఽపి నాస్తి దైవజ్ఞవర్జితః ॥ ౨౦॥

వారాన్ కేచిద్గ్రహాన్కేచిత్కేచిదృక్షాణి జానతే ।
త్రితయం యే విజానన్తి తే వాచస్పతయః స్వయమ్ ॥ ౨౧॥

గూఢచారులని (ఇతర రాజోద్యోగులని) సంప్రదించాలి. (రాజుగారికి చెప్పిన ఫలితం తప్పయితే ప్రమాదం.) (14)

కొడుకు పుడతాడని తండ్రికి, కూతురు పుడుతుందని తల్లికి చెప్పే జ్యోతిష్కుడు విజయుడౌతాడు. (అందరూ సంప్రదించే వాడు) (15)

నాకు దీర్ఘాయువు ఉందా అని అడిగినవారికి జ్యోతిష్కుడు ఉందనే చెప్పాలి. ఎక్కువ కాలం బతికినవాడు జ్యోతిష్కుడికి బహుమానాలు ఇస్తాడు. చనిపోయిన వాడు (నీ జ్యోతిష్యం తప్పిందని) ఎవరిని అడుగుతాడు? (16)

జ్యోతిష్కుడు ఏది చెప్పినా తూచి తూచి, ఎప్పుడు జరుగుతుందో తెలియకుండా, అర్థం అయీ అవకుండా మాట్లడాలి. (17)

బీద వాళ్ళకి డబ్బు దొరుకుతుంది అని, ధనవంతులకి ఇంకా ఎక్కువ డబ్బు దొరుకుతుంది అని చెప్పే జ్యోతిష్కుడిని అందరూ స్వీకరిస్తారు. (18)

చెప్పినట్టే జరిగి వంద(రూపాయలు) లాభం వస్తే జ్యోతిష్కుడికి తాంబూలం దొరుకుతుంది, వెయ్యి(రూపాయలు) లాభంతో భోజనం లభిస్తుంది. చెప్పింది జరగకపోతే రోజు తిట్లు లభిస్తాయి. (19)

సప్త సముద్రాల మధ్య ఉన్న సకల భూమండలాన్ని పరిశీలిస్తే జ్యోతిష్కులు లేని జానెడు ప్రదేశం కూడా కనపడదు. (20)

(జ్యోతిష్కులు) కొందరు వారం తెలిసి, కొందరు గ్రహస్థానాలు తెలిసి, ఇంకొందరు నక్షత్ర స్థానాలు తెలిసి భవిష్యత్తు చెబుతారు. మూడూ తెలిసినవారు సాక్షాత్తు సరస్వతి స్వరూపాలు (వారి మాటలకి ఎదురు చెప్పకూడదు). (అందరికీ తెలిసిన వారాన్ని మొదటే చెప్పటం వల్ల ఇది వ్యంగ్యం అని గ్రహించాలి.) (21)

నైమిత్తికాః స్వప్నదృశో దేవతోపాసకా ఇతి ।
నిసర్గశత్రవః సృష్టా దైవజ్ఞానామమీ త్రయః ॥ ౨౨॥

స్వస్థైరసాధ్యరోగైశ్చ జన్తుభిర్నాస్తి కిం చన ।
కాతరా దీర్ఘరోగాశ్చ భిషజాం భాగ్యహేతవః ॥ ౨౩॥

నాతిధైర్యం ప్రదాతవ్యం నాతిభీతిశ్చ రోగిణి ।
నైశ్చిన్త్యాన్నాదిమే దానం నైరాశ్యాదేవ నాన్తిమే ॥ ౨౪॥

భైషజ్యం తు యథాకామం పథ్యం తు కఠినం వదేత్ ।
ఆరోగ్యం వైద్యమాహాత్మ్యాదన్యథాత్వమపథ్యతః ॥౨౫॥

నిదానం రోగనామాని సాత్మ్యాసాత్మ్యే చికిత్సితమ్ ।
సర్వమప్యుపదేక్ష్యన్తి రోగిణః సదనే స్త్రియః ॥ ౨౬॥

జృమ్భమాణేషు రోగేషు మ్రియమాణేషు జన్తుషు ।
రోగతత్త్వేషు శనకైర్వ్యుత్పద్యన్తే చికిత్సకాః ॥ ౨౭॥

ప్రవర్తనార్థమారమ్భే మధ్యేత్వౌషధహేతవే ।
బహుమానార్థమన్తే చ జిహీర్షన్తి చికిత్సకాః ॥ ౨౮॥

శకున ఫలాలు చెప్పేవారు, స్వప్న ఫలాలు చెప్పేవారు, దేవతా ఉపాసకులు (పూజల ద్వారా కోరినది సంపాదించి పెడతాం అనేవారు) ముగ్గురూ, జ్యోతిష్కులకి సహజ శత్రువులు (ఒక బిచ్చగాడు ఇంకొక బిచ్చగాడికి శత్రువు అయినట్టు).(22)

భయపడే దీర్ఘరోగులే వైద్యులకి పెన్నిధి. ఆరోగ్యంగా ఉన్నవాళ్ళు, మందులేని రోగం ఉన్నవాళ్ళు వైద్యుడికి పనికిరారు. (23)

వైద్యుడు రోగికి అతిగా ధైర్యం చెప్పకూడదు, రోగిని అతిగా భయపెట్టకూడదు. చింత లేకపోయినా, నిరాశ కలిగినా రోగి డబ్బులివ్వడు. (24)

వైద్యుడు ఎప్పుడూ వైద్యం ఎలా కావాలంటే అలా చేసి రోగికి కష్టమైన పథ్యం చెప్పాలి. ఆరోగ్యం బాగుపడితే వైద్యుడి మహిమ. లేకపోతే నువ్వు పథ్యం సరిగ్గా చేయలేదని అనవచ్చు. (రచయితకి, బహుశా కాలానుగుణంగా, వైద్య శాస్త్రం మీద నమ్మకం లేదు. వైద్యాన్ని జ్యోతిష్యంలాగా పరిగణిస్తున్నాడు.) (25)

ఇంట్లో ఆడవారు అనుభవం వల్ల రోగ లక్షణాలు, నామాలు, ఏ చికిత్స పనిచేస్తుందో, ఏది పనిచెయ్యదో చెబుతారు. (వైద్యులకి కావాల్సినవి డబ్బు. కాబట్టి నేర్చుకోరని వ్యంగ్యం. ఆడవారిని చిన్నచూపు చూడటం వల్ల వారి మాట పట్టించుకోరు, వైద్యులని నమ్ముతారు, గౌరవిస్తారు.) (26)

(చేసిన చికిత్స పనిచెయ్యక) రోగం ముదరటం, చివరికి రోగి మరణించటం చూస్తూ, నెమ్మదిగా వైద్యులు రోగం యొక్క అసలు తత్వం తెలుసుకుంటారు. (27)

మొదట చికిత్స మొదలు పెట్టటానికి, మధ్యలో ఓషధులు పేరుతో, చివరికి (రోగి ఆరోగ్యవంతుడు అయిన తరువాత) బహుమానం అంటూ డబ్బు లాగుతారు వైద్యులు. (28)

లిప్సమానేషు వైద్యేషు చిరాదాసాద్య రోగిణమ్ ।
దాయాదాః సమ్ప్రరోహన్తి దైవజ్ఞా మాన్త్రికా అపి ॥ ౨౯॥

రోగస్యోపక్రమే సాన్త్వం మధ్యే కిం చిద్ధనవ్యయః ।
శనైరనాదరస్యాన్తౌ స్నాతో వైద్యం న పశ్యతి ॥ ౩౦॥

దైవజ్ఞత్వం మాన్త్రికతా భైషజ్యం చాటుకౌశలమ్ ।
ఏకైకమర్థలాభాయ ద్విత్రియోగస్తు దుర్లభః ॥ ౩౧॥

అనృతం చాటువాదశ్చ ధనయోగో మహానయమ్ ।
సత్యం వైదుష్యమిత్యేష యోగో దారిద్ర్యకారకః ॥ ౩౨॥

కాతర్యం దుర్వినీతత్త్వం కార్పణ్యమవివేకతామ్ ।
సర్వం మార్జన్తి కవయః శాలీనాం ముష్టికిఙ్కరాః ॥౩౩॥

న కారణమపేక్షన్తే కవయః స్తోతుముద్యతాః ।
కిం చిదస్తువతాం తేషాం జిహ్వా ఫురఫురాయతే ॥ ౩౪॥

స్తుతం స్తువన్తి కవయో న స్వతో గుణదర్శినః ।
కీతః కశ్చిదలిర్నామ కియతీ తత్ర వర్ణనా ॥ ౩౫॥

(పనిలేక) ఆవలిస్తూ రోగి ఎప్పుడు వస్తాడో (ఎప్పుడు డబ్బు దొరుకుతుందో) అని ఎదురు చూస్తున్న వైద్యుడికి తీరా ఒక రోగి దొరికితే, ఆ రోగి దగ్గరకే దాయాదులు, దైవజ్ఞులు, మాంత్రికులు (అదే కారణంగా) చేరతారు. (29)

వ్యాధి సోకగానే రోగి వైద్యుడి భరోసా కోరుకుంటాడు. తరువాత కొంచెం డబ్బు ఖర్చు చేస్తాడు. వ్యాధి తగ్గుముఖం పడతే వైద్యుడిని ఆదరించడు. పూర్తిగా తగ్గి స్నానం చేసిన తర్వాత ముఖం చాటు చేస్తాడు. (30)

జ్యోతిష్యం, మంత్ర తంత్రాలు, వైద్యం, ముఖస్తుతి చెయ్యటం నాలుగు గొప్ప విద్యలు. ధన సంపాదనకి ఈ నాలుగు విద్యలలో ఏ ఒక్కటైనా చాలు. వీటిలో రెండో మూడో కలిసి ఉండటం చాలా అరుదు. (31)

అబద్ధాలు చెప్పడం, ముఖస్తుతి చెయ్యటం ధన సంపాదనకి గొప్ప మార్గాలు. నిజం చెప్పే అలవాటు, అది పాండిత్యంతో కలవటం దారిద్ర్యానికి కారణం.(32)

పిడికెడు బియ్యం కోసం కవులు పిరికితనాన్ని, అసభ్యతని, పీనాసితనాన్ని, బుద్ధిహీనతని కడిగేస్తారు (కప్పి పెడతారు). (ఈ అవగుణాలు ఉన్న వాళ్ళని పొగుడుతారు.)(33)

కవులకి పొగడటానికి కారణం అక్కర్లేదు. ఏమాత్రం పొగడటం ఆపినా వాళ్ళ నాలిక పీకుతుంది.(34)

వర్ణిస్తున్నదానిని స్వయంగా చూడాలని కవులు అనుకోరు. అక్కడ తుమ్మెద ఉంది అంటే ఇక్కడ వర్ణన మొదలు పెడతారు.(35)

ఏకైవ కవితా పుంసాం గ్రామాయాశ్వాయ హస్తినే ।
అన్తతోఽన్నాయ వస్త్రాయ తామ్బూలాయ చ కల్పతే ॥ ౩౬॥

శబ్దాఖ్యమపరం బ్రహ్మ సన్దర్భేణ పరిష్కృతమ్ ।
విక్రీయతే కతిపయైర్ధాన్యైర్వినియుజ్యతే ॥ ౩౭॥

వర్ణయన్తి నరాభాసాన్ వాణీం లబ్ధ్వాపి యే జనాః ।
లబ్ధ్వాపి కామధేనుం తే లాఙ్గలే వినియుఞ్జతే ॥ ౩౮॥

ప్రశంసన్తో నరాభాసాన్ ప్రలపన్తోఽన్యథాన్యథా ।
కథం తరన్తు కవయః కామపారమ్యవాదినః ॥ ౩౯॥

యత్సన్దర్భే యదుల్లేఖే యద్వ్యఙ్గ్యే నిభృతం మనః ।
సమాధేరపి తజ్జ్యాయాః శఙ్కరో యది వర్ణ్యతే ॥౪౦॥

గృహిణీ భగినీ తస్యాః శ్వశురౌ శ్యాల ఇత్యపి ।
ప్రాణినాం కలినా సృష్టాః పఞ్చ ప్రాణా ఇమేఽపరే ॥ ౪౧॥

జామాతరో భాగినేయా మాతులా దారబాన్ధవాః ।
అజ్ఞాతా ఏవ గృహిణాం భక్షన్త్యాఖువద్గృహే ॥ ౪౨॥

ఒక్క కవిత రాసి కవి మొదట ప్రతిఫలంగా ఒక గ్రామం (అగ్రహారం) ఆశిస్తాడు. క్రమంగా గుర్రంతో, ఏనుగుతో, అన్నవస్త్రాలతో, చివరికి తామ్బూలంతో సరిపెట్టుకుంటాడు. (36)

శబ్దం బ్రహ్మ స్వరూపం (సర్వమూ బ్రహ్మమే, సర్వ జ్ఞానమూ శబ్దమే). సందర్భాన్ని బట్టి అది అలంకరించ బడుతుంది. కొందరు దాన్ని (శబ్దాన్ని) అమ్ముతారు. కొందరు వృధా చేస్తారు. (37)

సరస్వతీ కటాక్షం లభించి మూఢులని పొగిడే వాడు, కామధేనువు లభిస్తే, దానిచేత పొలం దున్నించే వాడితో సమానం. (38)

తాత్కాలికమైన కోరికలు తీర్చుకోవడమే ముఖ్యమని వాదించి (అందుకై) మూఢులని పొగడటం, పిచ్చి పిచ్చిగా మాట్లాడటం చేసే కవులు ఎలా దాటతారు? (మహాకవులు అవడానికి లేదా ముక్తి సాధకునికి ఉండే అడ్డంకులని) (39)

శంకరుని గురించి ఎలా విస్తరించి రచించినా, వ్యంగ్యంగా రచించినా అది సమాధిలో లభించే ఆత్మ జ్ఞానం కంటే గొప్పది. (ఇది పూర్తిగా వ్యంగ్యం. తెలిసీ తెలియని వారు తోచినదేదో రాసి దానికి శంకరుని పేరు తగిలించి తమ రచనలు గొప్పవని చాటటం, చాటించకోవడాన్ని దూషించడం.) (40)

భార్య, మరదలు, అత్తమామలు, బావమరిది, ఈ ఐదుగురు కలియుగంలో అదనంగా సృష్టించబడిన ఐదు ప్రాణాలు (శాస్త్రాలు చెప్పిన ప్రాణ, అపాన, సమాన, ఉదాన, వ్యాన వాయువులకి తోడు).(41)

అల్లుళ్ళు, బావగార్లు, మేనమామలు, భార్య యొక్క చుట్టాలు, గృహస్థునికి తెలియకుండా, గాదెలో ఎలకల లాగా, ఇంట్లో తింటూ ఉంటారు. (42)

మాతులస్య బలం మాతా జామాతుర్దుహితా బలమ్ ।
శ్వశురస్య బలం భార్యా స్వయమేవాతిథేర్బలమ్ ॥ ४३॥

జామాతుర్వక్రతా తావద్యావచ్ఛ్యాలస్య బాలతా ।
ప్రబుధ్యమానే సారల్యం ప్రబుద్ధేఽస్మిన్ పలాయనమ్ ॥ ४४॥

భార్యా జ్యేష్ఠా శిశుః శ్యాలః శ్వశ్రూః స్వాతన్త్ర్యవర్తినీ ।
శ్వశురస్తు ప్రవాసీతి జామాతుర్భాగ్యధోరణీ ॥ ४५॥

భూషణైర్వ్యసనైః పాత్రైః పుత్రాణాముపలాలనైః ।
సకృదాగత్య గచ్ఛన్తీ కన్యా నిర్మార్ష్టి మన్దిరమ్ ॥ ४६॥

గృహిణీ స్వజనం వక్తి శుష్కాహారం మితాశనమ్ ।
పతిపక్ష్యాంస్తు బహ్వాశాన్ క్షీరపాంస్తస్కరానపి ॥ ४७॥

భార్యే ద్వే పుత్రశాలిన్యౌ భగినీ పతివర్జితా ।
అశ్రాన్తకలహో నామ యోగోఽయం గృహమేధినామ్ ॥ ४८॥

భార్యే ద్వే బహవః పుత్రా దారిద్ర్యం రోగసమ్భవః ।
జీర్ణౌ చ మాతాపితరావేకైకం నరకాధికమ్ ॥ ४९॥.

(ఇంట్లో అతిథి సత్కారాలు లభించడానికి) మేనమామకి తల్లి ఆసరా, అల్లుడికి కూతురు ఆసరా, మామగారికి భార్య ఆసరా. (మిగతా) అతిథుల సత్కారం యజమాని స్వయంగా చూసుకోవాలి. (43)

బావమరిది బాలుడైతే అల్లుడు తప్పుడు పనులు (ఆస్తి కోసం) చేస్తాడు. అతను బుద్ధి తెచ్చుకోవడం మొదలు పెడితే ఇతను అలాంటి పనులు ఆపుతాడు. అతనికి పూర్తిగా జ్ఞానం వస్తే ఇతను (తన ఇంటికి) వెళ్ళి పోతాడు. (44)

భార్య పెద్ద కూతురు అవటం, బావమరిది బాలుడు అవటం, అత్త స్వేచ్ఛగా తిరగటం, (తిరుగుబోతు కావటం), మామగారు పరదేశంలో ఉండటం క్రమంగా అల్లుడి భాగ్యానికి కారణాలు అవుతాయి. (45)

పుట్టింటికి వచ్చిన కూతురు, నగలు, బట్టలు, వంటగిన్నెలు, పిల్లలకి బహుమానాలు మొదలైన వాటితో ఇంటిని కడుగుతుంది (ఖాళీ చేస్తుంది).( 46)

గృహిణి ఎప్పుడూ తనవైపు వారు చూడవచ్చినపుడు అతి సాధారణ భోజనం, అదికూడా మితంగా తీసుకుంటారు, భర్త వైపువారు మాత్రం పాలు పోసిన భోజనం, అదికూడా ఎక్కువగా కావాలనటమే కాక వాళ్ళు దొంగలు అని వాపోతుంది. (47)

కొడుకులు గల ఇద్దరు భార్యలు, భర్త వదిలివేసిన సోదరిగల గృహస్థుడికి దక్కేది ఆగని కలహం. (ఆ కాలంలో కొడుకులకి మాత్రమే ఆస్తి లభించేది.) (48)

ఇద్దరు భార్యలు, చాలా మంది కొడుకులు, దారిద్ర్యం, జబ్బు చేయటం, ముసలి తల్లితండ్రులు; వీటిలో ప్రతి ఒక్కటి నరకం కంటే బాధాకరం. (49)

స్మృతే సీదన్తి గాత్రాణి దృష్టే ప్రజ్ఞా వినశ్యతి ।
అహో మహదిదం భూతముత్తమఋణాభిశాబ్ధితమ్ ॥ ౨౦॥

అన్తకోఽపి హి జన్తూనామన్తకాలమపేక్షతే ।
న కాలనియమః కశ్చిదుత్తమార్ణస్య విద్యతే ॥౨౧॥

న పశ్యామో ముఖే దంష్ట్రాం న పాశం వా కరాఞ్జలే ।
ఉత్తమార్ణమవేక్ష్యైవ తథాప్యుద్వేజితే మనః ॥౨౨॥

శత్రౌ సాన్త్వం ప్రతీకారః సర్వరోగేషు భేషజమ్ ।
మృత్యౌ మృత్యుఞ్జయధ్యానం దారిద్ర్యే తు న కించన ॥ ౨౩॥

శక్తిం కరోతి సఞ్చారే శీతోష్ణే మర్షయత్యపి ।
దీపయత్యుదరే వహ్నిం దారిద్ర్యం పరమౌషధమ్ ॥ ౨౪॥

గిరం స్ఖలన్తీం మీలన్తీం దృష్టిం పాదౌ విసంస్థులౌ ।
ప్రోత్సాహయతి యాచ్ఞాయాం రాజాజ్ఞేవ దరిద్రతా ॥ ౨౫॥

జీర్యన్తి రాజవిద్వేషా జీర్యన్త్యవిహితాన్యపి ।
ఆకిఞ్చన్యబలాఢ్యానామన్తతోఽశ్మాపి జీర్యతి ॥ ౨౬॥

నాస్య చోరా న పిశునా న దాయాదా న పార్థివాః ।
దైన్యం రాజ్యాదపి జ్యాయో యది తత్త్వం ప్రబుధ్యతే ॥ ౨౭॥

అప్పిచ్చినవాడు అనబడే ఈ భూతం చాలా గొప్పది. గుర్తుకొస్తే చాలు శరీరం వణుకుతుంది. కనపడితే మతి పోతుంది. (50)

జీవుల ఆయువు తీరే సమయం కోసం ఆగి యముడు కనపడతాడు. అప్పిచ్చినవాడికి మాత్రం ఏ కాల నియమాలూ ఉండవు.(51)

(యముడిలాగా) నోటిలో కోరలు, చేతిలో పాశమూ లేకపోయినా అప్పిచ్చినవాడిని చూస్తే మనస్సులో భయం వేస్తుంది. (52)

శత్రువులతో రాజీ పడవచ్చు, అన్ని రోగాలకీ మందులు ఉంటాయి, మృత్యువునుంచి కూడా మృత్యుఞ్జయుణ్ణి (శివుని) ధ్యానించి తప్పించుకోవచ్చు. కానీ దారిద్ర్యాన్నించి తెప్పించుకోవటానికి ఏ ఉపాయమూ లేదు. (53)

దారిద్ర్యం చాలా గొప్ప ఔషధం. అది (బిచ్చమెత్తుకుంటూ) తిరగటానికి శక్తిని ఇస్తుంది. ఎండని, చలిని తట్టుకోవడానికి (ఇల్లు, బట్ట లేవు కనుక) తోడ్పడుతుంది. పొట్టలో అగ్ని రూపమైన ఆకలి పుట్టిస్తుంది (తిండి లేదు కనుక).(54)

మాట తడబడటం, కళ్ళు పూర్తిగా తెరవలేక పోవటం, కాళ్ళు వణకటం, రాజుగారి ఆజ్ఞ విన్నప్పుడు మాత్రమే కాదు దారిద్ర్యం వల్ల బిచ్చం ఎత్తుకుంటున్నప్పుడు కూడా కలుగుతాయి. (55)

దరిద్రుడిని రాజుగారి కోపం ఏమీ చెయ్యలేదు. చేయకూడని పనులనే సామాజిక నియమాలూ ఏమీ చేయలేవు. దారిద్ర్యమనే బలం ఉంటే రాళ్ళు సైతం అరుగుతాయి (ఏది దొరికితే అది తినాలి కనుక).(56)

నిజం తెలుసుకుంటే రాజ్యం కంటే దారిద్ర్యమే గొప్ప. దొంగల భయం, వెన్నుపోటు పొడిచేవారి భయం, దాయాదుల భయం, ఇతర రాజుల భయం లేవు.(57)

ప్రకాశయత్యహఙ్కారం ప్రవర్తయతి తస్కరాన్ ।
ప్రోత్సాహయతి దాయాదాంల్లాక్ష్మీః కిఞ్చిదుపస్థితా ॥ ౫౮॥.

విడమ్బయన్తి యే నిత్యం విదగ్ధాన్ ధనినో జనాః ।
త ఏవ తు విడమ్బ్యన్తే శ్రియా కిఞ్చిదుపేక్షితాః ॥ ౫౯॥

ప్రామాణ్యబుద్ధిః స్తోత్రేషు దేవతాబుద్ధిరాత్మని ।
కీటబుద్ధిర్మనుష్యేషు నూతనాయాః శ్రియః ఫలమ్ ॥ ౬౦॥

శృణ్వన్త ఏవ పృచ్ఛన్తి పశ్యన్తోఽపి న జానతే ।
విడమ్బనాని ధనికాః స్తోత్రాణీత్యేవ మన్వతే ॥ ౬౧॥

ఆవృత్య శ్రీమదేనాన్ధానన్యోన్యకృతసంవిదః ।
స్వైరం హసన్తి పార్శ్వస్థా బాలోన్మత్తపిశాచవత్ ॥ ౬౨॥

స్తోతవ్యైః స్తూయన్తే నిత్యం సేవనీయైశ్చ సేవ్యతే ।
న బిభేతి న జిహ్రేతి తథాపి ధనికో జనః ॥ ౬౩॥

క్షణమాత్రం గ్రహావేశో యామమాత్రం సురామదః ।
లక్ష్మీమదస్తు మూర్ఖాణామాదేహమనువర్తతే ॥ ౬౪॥

శ్రీర్మాసమర్ధమాసం వా చేష్టిత్వా వినివర్తతే ।
వికారస్తు తదారబ్ధో నిత్యం లశునగన్ధవత్ ॥ ౬౫॥

ఏ కొంచెం డబ్బు చేరినా, వ్యక్తి లోని అహంకారం బయటికి వస్తుంది, దాయాదులకి (డబ్బు తీసుకోవాలి అని) ప్రోత్సాహం లభిస్తుంది, దొంగలకి ఉత్సాహం వస్తుంది. (58)

ఏ ధనవంతులు ఎల్లప్పుడూ పండితులని వెక్కిరిస్తారో, లక్ష్మీ కటాక్షం కొంచెం కొరవైనప్పుడు తామే ఇతరుల వెక్కిరింతలకి గురి అవుతారు. (ధనవంతులు కొంచెం డబ్బు నష్టం కలిగినా గోల పెట్టి, వెక్కిరింతలకి గురి అవుతారు.)( 59)

ఇతరుల స్తోత్ర పాఠాలు నమ్మటం, తమని తాము దేవతా సమానులని అనుకోవటం, ఇతర మానవులని పురుగుల లాగా చూడటం, కొత్తగా డబ్బు చేరిన వారి లక్షణాలు. (60)

ధనవంతులు చెబుతున్నది విన్నా (వినిపించుకోకుండా) ప్రశ్నలు అడుగుతారు, కనిపించినా చూడరు (పట్టించుకోరు), వేళాకోళం చేస్తే మెచ్చుకోలు అనుకుంటారు. (61)

ధనమదం తో కప్పబడిన ధనికులు ఒకరినొకరు మాత్రమే అర్థం చేసుకుని చంటిపిల్లల లాగానో, పిచ్చి ఎక్కిన వారి లాగానో లేక పిశాచాల లాగానో పక్కన ఉన్నవారిని (ధనం లేని వారిని) చూసి అదుపు లేకుండా నవ్వుతారు. (62)

(తమ కంటే వాస్తవానికి గొప్ప వారై) తాము సేవ చేసి స్తుతి చేయవలసిన వారు తమని స్తుతించి సేవ చేస్తూ ఉంటే ధనికులు భయపడరు, సిగ్గు పడరు. (63)

దెయ్యం పట్టటం ఒక క్షణం మాత్రమే. తాగుడు మైకం మూడు గంటలు. మూర్ఖుల ధనమదం మాత్రం బతికి ఉన్నన్నాళ్ళూ. (64)

డబ్బు కొద్ది రోజుల మాత్రమే ఉండి వెడలిపోతుంది. దానివల్ల కలిగిన వికారం మాత్రం వెల్లుల్లి వాసన లాగా వదలదు. (65)

కణ్ఠే మదః కోద్రవజో హృది తామ్బూలజో మదః।
లక్ష్మీమదస్తు సర్వాఙ్గే పుత్రదారముఖేష్వపి ॥౬౬॥

యత్రాసీదస్తి వా లక్ష్మీస్తత్రోన్మదః ప్రవర్తతామ్ ।
కులేఽప్యవతరత్యేష కుష్ఠాపస్మారవత్కథమ్ ॥౬౭॥

అధ్యాపయన్తి శాస్త్రాణి తృణీకుర్వన్తి పణ్డితాన్ ।
విస్మారయన్తి జాతిం స్వాం వరాటాః పఞ్చషా కరే ॥ ౬౮॥

బిభర్తు భృత్యాన్ ధనికో దత్తాం వా దేయమర్థిషు ।
యావద్యాచకసాధర్మ్యం తావల్లోకో న మృష్యతి ॥౬౯॥

ధనభారో హి లోకస్య పిశునైరేవ ధార్యతే ।
కథం తే తం లఘూకర్తుం యతన్తేఽపరథా స్వతః ॥ ౭౦॥

శ్రమానురూపం పిశునే కిముపక్రియతే నృపైః ।
ద్విగుణం త్రిగుణం చైవ కృతాన్తో లాలయిష్యతి ॥ ౭౧॥

గోకర్ణే భద్రకర్ణే చ జపో దుష్కర్మనాశనః ।
రాజకర్ణే జపః సద్యః సర్వకర్మవినాశనః ॥ ౭౨॥

న స్వార్థం కిఞ్చిదిచ్ఛన్తి న ప్రేర్యన్తే చ కేన చిత్ ।
పరార్థేషు ప్రవర్తన్తే శఠాః సన్తశ్చ తుల్యవత్ ॥ ౭౩॥

సారాయి మత్తు కంఠానికి పరిమితం. తామ్బూలం మత్తు హృదయం వరకు. ధనమదం మాత్రం అన్ని అంగాలకీ, భార్యాబిడ్డల నోటికి కూడా వ్యాపిస్తుంది. (66)

వర్తమానం లో కానీ, గతం లో కానీ ధనం ఉన్నచోట కుష్టురోగం లాగా బంధువులలో మదం, ఇష్టం వచ్చినట్టు మాట్లాడటం, వ్యాపించటం చూడవచ్చు. (67)

ఐదు ఆరు కాసులు చేతికి రాగానే, తన జాతిని మరిచిపోయి పండితులని గడ్డి పోచలాగా తీసిపారేసి, శాస్త్రాలు బోధించటం మొదలు పెడతారు. (68)

ధనికుడు ఎంతగా నౌకర్లను పోషించినా, ఎంతగా అడిగిన వారికి దానాలు చేసినా, బిచ్చగాడిలాగా ప్రవర్తిస్తే లోకులు మెచ్చరు. (69)

లోకంలోని సకల ధనం యొక్క బరువు చాడీకోరే భరిస్తున్నాడు. అందుకే అది తగ్గించుకోవడానికి నిరంతరం ప్రయత్నాలు చేస్తూ ఉంటాడు. (చాడీలు చెప్పి ఇతరులకి నష్టం కలిగిస్తాడు). (70)

చాడీకోరుకి రాజు ఇవ్వగలిగిన బహుమతి (శిక్ష) ఏముంది? ఇవ్వవలసినది యముడు రెండు మూడు రెట్లు అధికంగా ప్రసాదిస్తాడు. (71)

గోకర్ణ భద్రకర్ణ క్షేత్రాలలో జపం చేస్తే దుష్కర్మ నశిస్తుంది. రాజు గారి చెవిలో జపం చేస్తే (చాడీలు చెబితే) (ప్రత్యర్థి) అన్ని విధాలా నాశనం అవుతాడు. (72)

చాడీకోరుకీ సజ్జనులకీ పోలిక ఉంది. ఇరువురికీ స్వార్థం లేదు. ఈ పని చేయమని ఎవ్వరూ చెప్పనక్కర్లేదు. ఇద్దరూ ఇతరుల కోసమే శ్రమపడతారు. (73)

కాలాన్తరే హ్యనర్థాయ గృధ్రో గేహోపరి స్థితః ।
ఖలో గృహసమీపస్థః సద్యోఽనర్థాయ దేహినామ్ ॥౨౪॥

శుష్కోపవాసో ధర్మేషు భైషజ్యేషు చ లఙ్ఘనమ్ ।
జపయజ్ఞశ్చ యజ్ఞేషు రోచతే లోభశాలినామ్ ॥ ౨౫॥

కిం వక్ష్యతీవ ధనికాద్యావదుద్విజతేఽధనః ।
కిం ప్రక్ష్యతీతి లుబ్ధోఽపి తావదుద్విజతే తతః ॥౨౬॥

సర్వమాతిథ్యశాస్త్రార్థం సాక్షాత్కుర్వన్తి లోభినః ।
భిక్షాకబలమేకైకం యే హి పశ్యన్తి మేరువత్ ॥ ౨౭॥

ధనపాలః పిశాచో హి దత్తే స్వామిన్యుపస్థితే ।
ధనలుబ్ధః పిశాచస్తు న కస్మైచనదిత్సతే ॥ ౨౮॥

దాతారోఽర్థిభిరర్థ్యన్తే దాతృభిః పునోఽర్థినః ।
కర్తృకర్మవ్యతీహారాదహో నిమ్నోన్నతం కియత్ ॥ ౨౯॥

స్వస్మిన్నసతి నార్థస్య రక్షకః సమ్భవేదితి ।
నిశ్చిత్యైవం స్వయమపి భుఙ్క్తే లుబ్ధః కథంచన ॥ ౩౦॥

ప్రస్థాస్యమానః ప్రవిశేత్ప్రతిష్ఠేత దినే దినే ।
విచిత్రానుల్లిఖేద్విఘ్నాంస్తిష్ఠాసురతిథిశ్చిరమ్ ॥౩౧॥

గద్ద ఇంటి మీద వాలితే భవిష్యత్తులో చెడు జరుగుతుంది. దుష్టుడు ఇంటి దగ్గర ఉంటే ఆ చెడు ఏదో ఇప్పుడే కలుగుతుంది. (74)

లోభులు ధర్మ కార్యంగా శుష్క ఉపవాసం, ఔషధంగా ఉపవాసం, యజ్ఞానికి బదులు (ఖర్చు లేని) జపమూ ఇష్టపడతారు. (75)

ధనికుడు (మనని) ఏమంటాడో అని మనసులో బెరుకు ఉంటుంది (భరించాలి కనుక). లోభి ఏమి అడుగుతాడో అని కూడా బెరుకు ఉంటుంది. (76)

లోభులు ఆతిథ్యం యొక్క అసలైన అర్థం, దాని గొప్పతనం మనకి తెలియచెబుతారు. భిక్ష పెట్టిన ఒక్కొక్క ముద్దని మేరు పర్వతం లాగా చూస్తారు. (77)

ధనాన్ని కాపాడే పిశాచం ఆ ధనం యొక్క నిజమైన యజమానికి ఇచ్చేస్తుంది. ధనలోభ పిశాచం ఎప్పటికీ, ఎవరికీ ఇవ్వదు. (78)

ధనం ఇవ్వమని అడిగే వాళ్ళు దాతలని వెతుకుతుంటారు. దాతలు కూడా దానం తీసుకునే వాళ్ళని వెతుకుతుంటారు. దాత ముందు వాక్యం లో కర్త. తరువాత దానిలో కర్మ. ఈ విధంగా కర్త కర్మలు మార్పిడి వల్ల హెచ్చుతగ్గులు ఎంత మారతాయి? (మారవు. ఇది వ్యంగ్యం. దాత అర్థిని వెతుక్కుంటూ వెళ్ళినా, దాతని అర్థి వెతుక్కున్నా దాత గొప్ప అన్నది మారదు.) (79)

నేను లేకపోతే నా ధనానికి రక్షకుడు ఉండడనే, లోభి ఎలాగో అలాగ తిండి తింటాడు (తన తిండి కోసం ధనం ఖర్చు చేస్తాడు).(80)

శాశ్వతంగా ఉండదలచిన అతిథి ఈ రోజే వెళ్ళిపోతున్నట్టు ప్రవేశించి, ఏరోజుకారోజు (వెళ్ళలేక పోటానికి) విచిత్రమైన అడ్డంకులు చూపించాలి. (81)

ప్రదీయతే విదుష్యేకం కవౌ దశ నటే శతమ్ ।
సహస్రం దామ్భికే లోకే శ్రోత్రియే తు న కిఞ్చన ॥౧౨॥

ఘుటకం సమ్యగారాధ్య వైరాగ్యం పరమం వహేత్ ।
తావదర్థాః ప్రసిద్ధ్యన్తి యావచ్చాపలమావృతమ్ ॥౧౩॥

ఏకతః సర్వశాస్త్రాణి తులసీకాష్ఠమేకతః ।
వక్తవ్యం కించిదిత్యుక్తం వస్తుతస్తులసీపరా ॥౧౪॥

విస్మృతం వాహటేనేదం తులస్యాః పఠతా గుణన్।
విశ్వసమ్మోహినీ విత్తదాయినీతి గుణద్వయమ్ ॥౧౫॥

కౌపీనం భసితాలేపో దర్భారుద్రాక్షమాలికా ।
మౌనమేకాసనం చేతి మూర్ఖసఞ్జీవనాని షట్ ॥౧౬॥

లోకం చదువుకున్న వాడికి ఒక రూక, కవికి పది, నటుడికి వంద దామ్భికుడికి వెయ్యి రూకలు సమర్పిస్తుంది. వేద పండితుడికి ఏమీ ఇవ్వదు. (82)

కార్యక్రమం ఏర్పాటు చేసిన వాడిని (ముందుగానే) మంచి చేసుకుని, కావలసిన డబ్బు మొదలైనవి లభించే వరకు, విరాగి అయినట్లు నటించాలి. (83)

సర్వ శాస్త్రాలతో ఎండిన తులసి పుల్లని పోలిస్తే, ఆ తులసి పుల్లే గొప్పది. (తులసిని మెచ్చుకున్నట్టు కనపడుతుంది కానీ ఇది వ్యంగ్యం. అందుకే కాష్టంతో (శవం కాల్చడానికి పనికి వచ్చే కర్ర) పోల్చటం. దానికి ఉన్న విలువ కూడా శాస్త్రాలకి లేదు అనటం. ముందర ఉన్న పద్యాలలో జ్యోతిష్య వైద్య శాస్త్రాలని వేళాకోళం చేసారు. ఇప్పుడు అన్ని శాస్త్రాలనీ.) (84)

వాహటుడు తులసి యొక్క గుణాలలో ప్రపంచంలో అందరినీ ఆకట్టుకోవటం, ధనం ప్రసాదించటం అనే రెండింటినీ లెక్కించటం మరచిపోయాడు. (దీనిలోని వ్యంగ్యం, వాహటుడు రాసినది ఆయుర్వేద గ్రంధం అని తెలుసుకున్న వారికి మాత్రమే అర్థం అవుతుంది. తులసి మాలలని ధరించిన వారు అందరినీ ఆకట్టుకుని ధనం సంపాదించుకుంటారని వెక్కిరించటం దీని అంతరార్థం. పైపెచ్చు కలి విడంబనం కాబట్టి తులసి ధరించిన నిజమైన భక్తులు ఉంటారనే మినహాయింపు కూడా లేదు.) (85)

గోచీ, భస్మం, ధర్భ, రుద్రాక్షమాల, మౌనం, కదలకుండా కూర్చోవడం అనే ఆరూ మూర్ఖుల యొక్క సంజీవిని మూలికలు. (ఇవి సన్యాసి బాహ్య లక్షణాలు. మూర్ఖులు పనిచేయకుండా బ్రతకటానికి సాధనాలు.) (86)

వాసః పుణ్యేషు తీర్థేషు ప్రసిద్ధశ్చ మృతో గురుః ।
అధ్యాపనావృత్తయశ్చ కీర్తనీయా ధనార్థిభిః ॥౮౭॥

మన్త్రభ్రంశే సమ్ప్రదాయః ప్రయోగశ్చ్యుతసఙ్గతౌ ।
దేశధర్మస్త్వనాచారే పృచ్ఛతాం సిద్ధముత్తరమ్ ॥ ౮౮॥

యథా జానన్తి బహవో యథా వక్ష్యన్తి దాతరి ।
తథా ధర్మం చరేత్సర్వం న వృథా కించిదాచరేత్ ॥౮౯॥

సదా జపపటో హస్తే మధ్యే మధ్యేఽక్షిమీలనమ్ ।
సర్వం బ్రహ్మేతి వాదశ్చ సద్యస్ప్రత్యయహేతవః ॥౯౦॥

ఆమధ్యాహ్నం నదీవాసః సమాజే దేవతార్చనమ్ ।
సతతం శుచివేషశ్చ ఇత్యేతద్దమ్భస్య జీవితమ్ ॥౯౧॥

తావద్దీర్ఘం నిత్యకర్మ యావత్స్యాద్ద్రష్టృమేలనమ్ ।
తావత్సఙ్క్షిప్యతే సర్వం యావద్ద్రష్టా న విద్యతే ॥౯౨॥

ఆనన్దబాష్పరోమాఞ్చౌ యస్య స్వేచ్ఛావశంవదౌ ।
కిం తస్య సాధనైరన్యైః కిఙ్కరాః సర్వపార్థివాః ॥౯౩॥

శిష్యులకి పాఠాలు నేర్పటం ద్వారా డబ్బు సంపాదించు కోవాలి అనుకున్న వారికి అనువైన మార్గాలు, పుణ్య క్షేత్రాలలో జీవించటం, చనిపోయిన ప్రసిద్ధుడైన వ్యక్తి తన గురువు అని చెప్పుకోవటం. (పుణ్యక్షేత్రాలలో యాత్రికులు వల్ల పేరు అందరికీ తెలుస్తుంది. ఆ గురువు వీడు నా శిష్యుడు కాదు అని అనలేడు.) (87)

మంత్రం తప్పుగా పలికావేమని అడిగితే ఇది మా సాంప్రదాయం అని, సంస్కృతంలో వ్యాకరణ దోషం చూపితే ఇది దేశాచారం అన్నవి తిరుగు లేని సమాధానాలు. (88)

ధర్మ కార్యాలు, పదిమందికీ తెలిసి, వాళ్ళు ధన దాతలకి ఇలా జరుగుతోందని తెలిపేలాగ (అందువల్ల డబ్బు దొరికేలాగ) చెయ్యాలి, వృధాగా చెయ్యకూడదు. (89)

ఎల్లప్పుడూ చేతిలో జపమాల ఉంచిన సంచీ, మధ్య మధ్య అరమూసిన కళ్ళు, సర్వమూ బ్రహ్మమే అని వాదించటం ఉంటే (జనులకి) గొప్పవాడనే నమ్మకం ఏర్పడుతుంది. (90)

మధ్యాహ్నం వరకు నదిలో నుంచుని ఉండటం (అందరూ చూసేలా జపం), నలుగురిలో దైవ పూజ, ఎల్లప్పుడూ శుచి వస్త్రాలు ధరించటం దామ్భికుడి జీవితం. (91)

చూసే వాళ్ళు ఉన్నంతసేపూ రోజూ చేసే పూజలు, ధర్మ కార్యాలు సాగుతూ ఉంటాయి. చూసే వాళ్ళు లేకపోతే అన్నీ సంక్షిప్తంగా ముగుస్తాయి. (92)

కావలసినప్పుడల్లా కంటిలో ఆనందభాష్పాలు రావటం, రోమాలు నిక్కబొడుచుకోవటం సాధించగలిగిన వాడికి ఇంకే సాధనాల అవసరం లేకుండానే రాజులందరూ దాసులు అవుతారు. (93)

దణ్డ్యమానా వికుర్వన్తి లాల్యమానాస్తతస్తరామ్ ।
దుర్జనానామతో న్యాయ్యం దూరాదేవ విసర్జనమ్ ॥ ౯౪॥

అదానమీషద్దానం చ కిఞ్చిత్కోపాయ దుర్ధియామ్।
సమ్పూర్ణదానం ప్రకృతిర్విరామో వైరకారణమ్ ॥ ౯౫॥

జ్యాయానసంస్తవో దుష్టైరీర్ష్యాయై సంస్తవః పునః ।
అపత్యసమ్బన్ధవిధిః స్యానర్థాయైవ కేవలమ్ ॥౯౬॥

జ్ఞాతేయం జ్ఞానహీనత్వం పిశునత్వం దరిద్రతా ।
మిలన్తి యది చత్వారి తద్దిశేఽపి నమో నమః ॥౯౭॥

పరఛిద్రేషు హృదయం పరవార్తాసు చ శ్రవః ।
పరమర్మాసు వాచం చ ఖలానామసృజద్విధిః ॥ ౯౮॥

విషేణ పుచ్ఛలగ్నేన వృశ్చికః ప్రాణినామివ ।
కలినా దశమాంశేన సర్వః కాలోఽపి దారుణః ॥౯౯॥

యత్ర భార్యాగిరో వేదా యత్ర ధర్మోఽర్థసాధనమ్ ।
యత్ర స్వప్రతిభా మానం తస్మై శ్రీకలయే నమః ॥౧౦౦॥

కామమస్తు జగత్సర్వం కాలస్యాస్య వశంవదమ్ ।
కాలకాలం ప్రపన్నానాం కాలః కిం నః కరిష్యతి? ॥ ౧౦౧॥

చెడ్డవాళ్ళకి గట్టిగా చెబితే తిరగబడతారు, మెత్తగా చెబితే మరింత చెడు చేస్తారు. చేయగలిగింది దుష్టుడికి దూరంగా ఉండటం మాత్రమే. (94)

దుష్టుడికి అడిగినది ఇవ్వకపోయినా, తక్కువగా ఇచ్చినా కోపం వస్తుంది. అడిగినది పూర్తిగా ఇస్తే మళ్ళీ అడుగుతాడు. ఇవ్వడం మొదలు పెట్టి ఇవ్వడం పూర్తిగా ఆపేస్తే శత్రువు అవుతాడు. (95)

దుష్టుడిని ఎరగక పోవటం శ్రేష్టం. దుష్టుడితో ఏ కొంచెం సంబంధం పెట్టుకున్నా ఫలితం ఈర్ష్య. దుష్టుడితో వివాహం లాంటి శాశ్వత సంబంధాలు కేవలం సర్వనాశనానికి దారి తీస్తాయి. (96)

బంధుత్వం, బుద్ధి లేకపోవటం, చాడీలు చెప్పటం, దారిద్యం, ఈ నాలుగు గుణాలు కలిసి ఉన్న దిక్కుకి కూడా ఒక నమస్కారం. (97)

ఎల్లప్పుడూ ఇతరుల తప్పుల గురించి ఆలోచించడం, ఇతరుల గురించి వినటం, ఇతరుల రహస్యాలను (బహిరంగంగా) చెప్పటం దుష్టుల కోసం బ్రహ్మ సృష్టించిన అలవాట్లు. (98)

తేలు తోకలో ఉన్న విషం కంటే కలిలో పదవ వంతు కూడా ఎల్లప్పుడూ జనులకి చాలా భయంకరం. (99)

ఏ కలి కాలంలో భార్య మాట వేదమో, (దాట రానిదో) ధర్మము (కేవలం) ధన సంపాదనకు మార్గమో, సొంత తెలివే సత్యానికి నిర్వచనమో, ఆ కాలానికి నమస్కారం. (100)

జగత్తు అంతా (బ్రహ్మము యొక్క) కామమే అగుగాక. (కానీ) అది మృత్యువుకి లోబడుతుంది. కాలానికి మృత్యువైన వానికి (శివునికి) లోబడిన మమ్మ్మ ఆ మృత్యువు ఏమి చేయగలదు? (101)

కవినా నీలకణ్ఠేన కలేరేతద్విడమ్బనమ్ ।
రచితం విదుషాం ప్రీత్యై రాజాస్థానానుమోదనమ్ ॥ ౧౦౨॥

—-------- కలి విడంబనం సంపూర్ణం —--------

కలి కాలాన్ని వెక్కిరిస్తూ చేసిన ఈ వర్ణన, విద్వాంసుల, రాజసభల ఆనందం కోసం నీలకంఠ కవిచే రచించబడింది. (102)

—------- కలి విడంబనం సంపూర్ణం —-------